శ్రీమత్తిరుపతిపురమున

శ్రీమీరాజి స్వాలసీ యుండు * శ్రీ హత్తీరాం

జీ మఠపుఁ శిరోహితుఁ డగు

రామార్యుని సుతుని చేత * రచియింపఁబడె

శ్రీ

# శ్రీకృష్ణతారావళి.

శా॥ శ్రీరామాధవనాభిపంకజభవుం *
జింతింతు నెల్లప్పుడున్
శ్రీరాజీవదళాక్షు మంగళకరున్ *
శ్రీకంఠుం జిత్తంబునన్
శ్రీరామామణి, నారమారమణి, నా *
శ్రీకంఠసాధ్వీమణిన్,
సారంగాక్షుల నాదువాక్కునను నిం *
టన్నంత తంబుండఁగన్.

చం॥ హిమనగజాత పార్వతికి *
నెంతయుఁ గూర్చెడు సూనుఁడై తఁడున్
హిమనగజాత తోడుతను *
నెప్పుడు వైరముఁ బూని యుండునా
రమణికి జహ్నుపుత్రికకు *
రంగుగఁ గూర్చెడు నట్టి పుత్రుఁడా
సుమశరరూపు విఘ్నవిభుఁ *
డోర్కువు బత్తిని గొల్తు నిచ్చలున్.

కం॥ వ్రేపల్లె నీవు పుట్టుము
బాపాత్ముని మాయఁబంపి * పొడమితివి గదా
యాపదఁ బెరికి దేవకి నీటు
శ్రీపతి ! విశ్వేశ ! శౌరి ! * శ్రీహరి ! కృష్ణా ! 1

కం॥ వ్రేపల్లెను నీవుండుటఁ
బాపాత్ముఁడు కంసుఁడెరిగి * పంపిన యసురం
బా పిని జన్నులఁ గుడుచుచుఁ
బాపితె ప్రాణముల కరయ * బాలక ! కృష్ణా ! 2

కం॥ వసగల నీటిని దన దగు
విసమునఁ గలియుంగఁ బెట్టు * విషధరమును నీ
విసుమంతయు లెక్కింపక
యసువులకుం బాపలేద * యారా ! కృష్ణా ! 3

కం॥ వలువలఁ జీరము పైనిడి
జలములఁ గ్రీడించు గోప-జలజాక్షులవౌ
వలువలఁ జెట్టునఁ బెట్టవె
జలజాక్షా ! గేలిసేయఁ * జతురతఁ గృష్ణా ! 4

కం॥ కొండను బూజింపంగను
దండింపఁగ గోపకులను-దన మేఘములన్
గండున నింద్రుఁడు పంపఁగఁ
గొండను నెత్తంగ లేదొ * కో శ్రీ కృష్ణా ! 5

కం॥ నినుఁ దోడ్కొని పోవఁగవ
చ్చిన యక్రూరునకు నప్పుడు * చిత్రంబుగనా
వనమందు విశ్వ రూపము
దినకర తేజమునఁ జూపి * తే శ్రీ కృష్ణా! 6

కం॥ అల మథురా నగరంబున
నలగజమును సట్టి ముష్టి * నడఁచవఁగ లేదే
యల చాణూరుని నొసటను
బలమునఁ బొడువంగ లేదె * బాలక! కృష్ణా! 7

కం॥ ననుఁ జంపఁగఁ బుట్టిన వా
నిని నేఁచంపంగ వలయు * నేఁడని సభలో
నను గూర్చుండిన కంసుని
నని తోయ చంప లేదె * యారా! కృష్ణా! 8

కం॥ తలిదండ్రులఁ జెఱసాలకు
వెలి యొనరిచి యుగ్రసేను * విడిపించి చెఱిం
బొలుపుగ మథురకు ఱేనిగ
నిలపై స్థాపింప లేదె * యీశ్వర! కృష్ణా! 9

కం॥ అందముగ వెలయు కాశిని
సాందీపుని యొద్ద విద్య * సొగఁ గఱచిత
న్నందను యమపురి నుండియు
నందంబుగఁ దెచ్చి యీవె * యప్పుడు కృష్ణా! 10

కం॥ మును నగరముఁ జొచ్చు తఱిం
దన వనితలెల్ల మాన్పు * దరహాసమునన్
వనితామణి నినుఁ జేరఁగ
జనవే లజ్జానితఁ గూడఁ * జయ్యనఁ గృష్ణా ! 11

కం॥ తన యన్నయె శిశుపాలుని
కిని దన్నీయంగ నెంచఁ * గేశవ ! నీకుం
దన మొఱ వినిపింపఁగను
జనవే రుక్మిణిని గావఁ * జయ్యనఁ గృష్ణా ! 12

కం॥ అరదమునఁ గన్నెఁ గొనుచును
నరుగుచు నుండంగఁ గాంచి * యట్టై నిలుపఁగన్
సరగునఁ దఱిమెదు మఱందిని
గరుణను సతి మొఱల వినుచుఁ * గావవె కృష్ణా ! 13

కం॥ అనువుగ నినుఁ గోరిన యా
వరికన్యకఁ దెచ్చి నీవు * వరియింప వ్రకో
సురలెల్లరు సంతసమున
విరులను నీమీఁదఁ జల్ల * వెలుఁగుచుఁ గృష్ణా ! 14

కం॥ ఆ రుక్మిణికిని నొక్కఁడు
గూరిమి సుతుఁడుదయమంది * కోపము తోడం
గ్రూరుని శంబరు నొక్కఁడ
క్రూర శరంబులను గూలఁ * గొట్టఁడె కృష్ణా ! 15

క॥ అదితికిఁ బ్రియముఁ బొనరింపఁగ
మదవతి నీ భార్య సత్య * మానుగ సాయం
బొదవింప బలిమిఁ జంపవె
మద మందిన నరకు నవుడు * మాధవ ! కృష్ణా ! 16

క॥ తన వనమున నుండిన యా
ఘనతరుపుష్పంబుఁ గోయఁ * గని యింద్రుఁడు చే
సిన మేలు మఱచి యనిచే
సిన వానికి గర్వహాని * సేయవె కృష్ణా ! 17

క॥ అనిరుద్ధుని గలలోనను
వనితామణి చూచి కూడ * వానిని నీకున్
మనుమని బాణుఁడు గట్టఁగఁ,
బెనుబాముస, వాని భంగ * పెట్టవె కృష్ణా ! 18

క॥ గరుడధ్వజుఁడనే యని
గరుడునికిని మాఱు కపట * గరుడుని పైభా
సురగతిఁ బౌండ్రుఁడు రాఁగా
గరుడధ్వజ ! చంపి యిలను * గావవె కృష్ణా ! 19

క॥ వైరంబున నిరువదియొక
సారులు మాగధుఁడు నిన్నుఁ * జంపఁగ వెడలన్
శూరుని భీముని గొని చని
వైరము సాధింప లేదె * బాలక ! కృష్ణా ! 20

కం॥ శతదూషణముల కోర్చితి
నితనిం జంపెదను న్నింక * నేనని పలుకన్
మితి మీఱక తిట్టిన, యా
హితదూరుని జంప లేదె * యీవటఁ కృష్ణా ! 21

కం॥ ధనవంతునకి దరిద్రుని
కిని నెక్కడి స్నేహ మనక * కేశవ ! నీవా
ధనహీనుని నీ మిత్రుని
ధనవంతుని జేయలేదె * ధార్మిక ! కృష్ణా ! 22

కం॥ ఆ కృష్ణ నాఁడు కొలఁకువున
హా ! కృష్ణా ! యంచు వేఁడ * నంబరతతులన్
శ్రీకాంత ! యొసఁగ లేదా ?
నాకిమ్మా వరము లిపుడు * నగధర ! కృష్ణా ! 23

కం॥ విజయుం డాహవభూమిని
స్వజనుల నెల్లరను గాంచి * స్వపరాక్రమముం
ద్యజియింపఁగ నుపదేశము
విజయునకుం జేయలేదె * వేగమె కృపా ! 24

కం॥ ఆ పార్థునిపై బాణము
కోపంబున నేయ నతఁడు * గోపింపఁగనో
పాపఁడ ! భీష్ముని మీఁదికిఁ
గోపంబున నుఱుక లేదా * కో శ్రీ కృష్ణా ! 25

కం॥ బాపఁడ పాండవ మగుమని
శాపంబుగ నేసినట్టి * శరమున్న నడలం
బాపని గర్భంబున నటు
కాపాడఁగ లేదె మేలి * కరుణను గృష్ణా ! 26

కం॥ మంగళమగు నీకెప్పుడు
మంగళమొసఁగంగ వేఁడ * మదిఁ బూనుచునీ
మంగళనామముఁ బల్కెద
మంగళ మెల్లప్పుడుఁ జేయు * మా శ్రీకృష్ణా ! 27

కం॥ నీ పేరటఁ దారావళి । గోపికతోఁ జెప్పి
నాఁడ * నో శ్రీకృష్ణా ! ॥ కాపాడుము
కాశ్యపుని । స్నీపాదము లానఁ
బాయ * నిను నే కృష్ణా ! ॥

శ్రీకృష్ణతారావళి
సంపూర్ణము.
సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

పాతాళభేది-సుబ్రహ్మణ్యము.



